

# పాడవే కోయిల

(తెలుగు గజళ్ళు)

ఎస్.ఆర్.పృధ్వి

**Paadave Koyila**
**(Telugu Gajallu)**
by
**S.R. Prithvi**



First Edition : JANUARY, 2017
Book No. 24

Copies - 500
Cover Designed by : Sri Srinivas

DTP & Printed at
Raju DTP & Offset
J.P.Road, Rajamahendravaram
Phone :0883-2461179

***For Copies***
Smt.P.Usha Rani
3-866, M.G. Street,
Ramakrishna Nager,
Rajamahendravaram-533 101
Ph :0883-2421123

and

Manikanta Book Center
Main Road
Rajamahendravaram - 533 101
Ph: 0883 - 2462507

**Price : RS. 50.00**

# మనుమరాళ్ళు





ఆశీస్సులతో...

**రసరాజు**
ప్రఖ్యాత సినీకవి
ఎల్.ఐ.జి. 177,
హౌసింగ్ బోర్డు కాలనీ



తణుకు-534211,
పశ్చిమ గోదావరి జిల్లా
సెల్ : 9440388659

# కరచాలనం

"గజల్" ప్రక్రియ తెలుగు రెక్కలు తొడిగి వినీలాకాశంలో ఎగురుతున్న కాలమిది. ఇది ముమ్మాటికీ డా॥ గజల్ శ్రీనివాస్ పుణ్యమే! ఆయన 'కంజిరా' పట్టుకొని నలభైయేండ్లుగా పృథ్వీ మండలాన్ని తన గజల్ గానంతో ప్రభావితం చేస్తుండటంతో కవుల దృష్టి క్రమంగా గజల్ పైకి మళ్ళింది. నాటి లబ్ద ప్రతిష్ఠులు మొదలుకొని నేటి యువకవుల వరకు గజల్‌ను తమ కలాల హలాలతో పండిస్తూనే ఉన్నారు. ప్రక్రియ ఏదైనా ప్రభాత స్ఫూర్తి నందివ్వటమే దాని ధ్యేయం కావాలి.

గజల్ ఒక రకంగా కష్టమైన ప్రక్రియ. "ఒక్క గజల్ వ్రాయాలని ఎంత చచ్చి బ్రతికానో / ఎన్ని ఎన్ని భావాలను పరితెచ్చి ఉతికానో..." అని నేనే ఒకసారి అన్నాను. క్లుప్తత, గుప్తత, ఆప్తత, ఇందుతో ప్రవహిస్తే తప్ప రంగు, రుచి, వాసన దీనికబ్బవు.

కాపియా (సహ అంత్యప్రాస), రదీఫ్‌లు (అంత్యప్రాస) రెండూ కత్తిమీద సాము వంటివి. అన్ని షేర్‌లలో రెండవ పాదాంతంలో కాపియా, రదీఫ్‌లు ఒక దాని వెంట ఒకటి ప్రయాణిస్తూ రావాలి. మొదటి షేర్‌లో (మత్లా) మాత్రం రెండు పాదాల్లోను ఈ రెండు చివర రావాలి. రెండు పాదాల కలయికే షేర్. 5 నుండి 17 వరకు ఈ షేర్‌లుండవచ్చు. ఏ షేర్‌కు ఆ షేర్ భావంలోను, వస్తువులోను స్వయం ప్రతిపత్తిని కలిగి ఉండవచ్చును. కాందంటే ఏకసూత్రతను పాటించవచ్చును. చివరి షేర్‌లో (మక్తా) కవి తాలూకు పేరుండాలి. దీనినే "తఖల్లుస్" అంటారు.

గజల్ పారసీక ప్రక్రియ "ఇంతులతో మంతనాలు" లేక "ప్రేయసితో సరస సల్లాపాలు" - ఇవే గజల్ జీవ వాహికలు. గజల్ ఒక రసమయ భావ ప్రపంచం.

తొలిరోజుల్లో గజల్‌లో నడిచిన షేర్లను గోడలమీద, దుస్తులపైన వ్రాయించుకొని అభిమానులు ముచ్చట పడేవారు. అంత ఆదరణకు నోచుకున్నదీ గజల్. గజల్ అనేది సమర్థుడైన కవిచేతిలో పడితే, దాని ఒయ్యారం అంతా ఇంతా కాదు. ఎగురుతున్న రంగుల గాలిపటమే అవుతుంది. అటువంటి గజల్‌ను ఎస్. ఆర్. పృథ్వి ఈనాడు పాఠకుల ముందుంచే ప్రయత్నం చేశారు.

పృథ్వి కలానికి ఎంతో వయస్సుంది. అనేక కవితా ప్రక్రియలు పృథ్వి చుట్టూ తిరిగాయి. అద్దేపల్లికి ఆత్మీయంగా హత్తుకొన్న కవి. అలనాడు గజల్ ప్రక్రియను అద్దేపల్లి కూడా ఉయ్యాలలూగించిన వారే. ఆ సాహచర్యం ఏదో సందర్భంలో పృథ్వికి ఉద్దీపన కలిగించే ఉంటుంది. లేకపోతే "పాడు కోయిలా" అంటూ కలానికి పని చేప్పేవాడు కాదు. ఆయన కోకిల ఏమందో ఇప్పుడు మనం విందాం.

"అబద్ధాలను మంచినీటి చెలమలుగా మార్చేసి
ప్రజల ముందు మధురమైన పాటలెన్నో పాడతారు"

గజల్‌లో ఇదొక షేర్. రాజకీయ నాయకుల నడకలపై కవి ఇక్కడ వ్యంగ్యాస్త్రం సంధించారు. తీర్చలేనట్టి ఆశలకు అందంగా ఏవేవో ముస్తాబులు చేసి, వంచిస్తున్న పరిస్థితులను దుయ్య బట్టడం ఈ పంక్తి ద్వయంలో (షేర్) కనిపిస్తుంది. పార్టీలు మారుతూ ఎన్నికల ముందు ఓట్లకోసమై సాష్టాంగపడే ఊసరవెల్లుల్ని "క్షణానికో రంగేసుకుని ప్రజల ముందు బోర్లాపడతాయరు...." అంటూ చివరి షేర్‌లో (మక్తా) వ్రేలెత్తి చూపిస్తాడు కవి. ఇటువంటి వేషగాళ్ళ విషయంలో అప్రమత్తత అవసరమంటూ ఉద్బోధించటమే గజల్ కవి ఆశయమిక్కడ.

గజల్‌లో కనిపించవలసిన ప్రేమలను ప్రక్కకు పెట్టి - ఈతరం గజల్ కవుల్లా మనిషిని మేల్కొలిపే దిశలో పృథ్వి తమ శంఖాన్ని పూర్తించటం మెచ్చుకో తగిన పరిణామం. ఇలా సమాజం వేపు దృష్టి సారించిన గజళ్లు ఈ పుస్తకం నిండా ఉన్నాయి.

మనిషిని ధనమే ఇంధనమై నడిపిస్తున్నందుకు కవి ఎంతగానో నొచ్చు కుంటాడు. అనుబంధాలన్నీ ఆవిరై పోతుంటే ఆవేదనతో అక్షరాల్ని తడుపుతూ పృథ్వి కలం ఓచోట ఇలా పాడుతుంది.

"ధనార్జన జీవి లక్షణంగా విస్తరించి
మానవ సంబంధాలను నీట కలుపుతుంది"

మార్పు, మనిషి చేతిలోనే ఉంది.దానికి ఆలోచన, ఆత్మ పరిశీలన కావాలి. ఈ ప్రబోధంతో ఇదే గజల్‌లో నడచిన మరో షేర్ దగ్గర ఆగుదాం.

"పట్టు పట్టి మనిషి సాధన చేసినపుడు
వెదురు బొంగైనా సప్తస్వరాలు పలుకుతుంది"

ఆ సాధన దిశగా అడుగులూనితే అణువణువూ అభ్యుదయమే పలుకరిస్తుంది. "లోచుపు" కావాలి. సాధన పుష్పించాలి. దీక్ష పరిమళించాలి. అప్పుడు వెదురు ముక్క కూడా వేణువవుతుంది. బ్రతుకే రాగ రంజితమవుతుంది.

"పచ్చి ఆకుల నారగించి పరవశించెడి పురుగులు
మదిని దోచెడి పట్టు వస్త్రానికి దారాన్ని అందించును"

అంటూ ఒక గజల్‌లో కాపియా లేని నాల్గవ షేర్‌లో పృథ్వి కలం వివరిస్తుంది. మిణుగురు పేరుతో ఒక పురుగు మెరుపవుతుంది. గొంగళిలో భోజనాన్ని విసర్జించి మరొక పురుగు పట్టు వస్త్రమై ఒంటిని అలంకరిస్తుంది. వగరు మేసి, ఇంకొక పక్షి కూతతో "వారెవ్వా" అనిపిస్తుంది. అయితే మనిషి మాటేమిటీ? ఈ పై గజల్‌లో మనిషిని మానవీయమైన మలుపు తిరగమంటూ నేరుగా చెప్పకుండానే, నేపథ్య సంగీతం లోంచి ఒక ప్రభోదాన్ని మన ముందుచుతాడు కవి.

సందేశాన్ని మోసుకొచ్చిన మరొక గజల్‌ని సమీక్షిద్దాం.

"నువ్వు నువ్వుగానే బ్రతకాలని అనుకో
నీ నవ్వుతో చెలిమిని గెలవాలని అనుకో"

........................................

........................................

"మాటల మాటున మలినాన్ని దాచిపెడతారు
చూపు వెన్నెల తోడ తొలిగించాలని అనుకో"

మనిషివైపు తిరిగి ఇక్కడే కవి ఏం చెపుతున్నాడో గ్రహించండి.

సౌజన్యం సాక్షిగా ఎవరి వ్యక్తిత్వం వారి కుండాలి. మలిన మెరుగని మందహాసంతో మంచు పూలను కూడా జయింపవచ్చును. ఓ ప్రక్క కరచాలనం చేస్తూనే మరో ప్రక్క తెలీకుండా కాలుతొక్కే సన్నిహితు లుంటారు. మంచితనంతో వాళ్ళలో ఒక మార్పు తీసుకొని రావాలి.

నిలబడ లేకపోతున్న బడుగుతనాన్ని మానవీయ దృక్పథంతో నిలబెట్టాలంటాడు.

ఇదే గజల్‌లో చివర షేర్ ఇలా సందేశ విహంగాన్ని ఎగరేస్తాడు కవి.

"బడుగులు అడుగుల ఉనికిని కోల్పోతున్నారు ఓ పృథ్వీ
అడుగులకు మనిషితనాన్ని నిండుగ పంచాలని అనుకో"

సందేశం ఏమాత్రం హృదయ కర్ణానికి సోకినా మనిషి గెలిచినట్లే!

ఆశయాలెప్పుడూ ద్వార తోరణాలుగా ఉండాలి. గుమ్మంపై ఊగుతూ గుండెలతో స్వాగతం పలికే మామిడాకుల్లా మనస్సును హత్తుకోవాలి. ఈ దిగువ ఒక ద్వార తోరణం భాసిల్లింది చూడండి.

"పచ్చని చెట్టుకు పువ్వు నవ్వాలని ఉంది
జగతి మెచ్చగ పరిమళించాలని ఉంది"

అనే మత్లాతో ప్రారంభమవుతుందీ గజల్. ఇందులో షేర్లన్నీ ఎన్నిక కాదగినవే! మూడవ షేర్‌లో ఆశయం వినండి.

"బీడు వారిన నేల తల్లి పాదాలను
కన్నీరైన కార్చి తడపాలని ఉంది"

నేల బీడు వారింది. కవి భాద పడ్డాడు. ఆకాశంలో మేఘాలు లేవు. ప్రక్కన నీటి సౌకర్యం లేదు. ఎలా? పుడమితల్లి పులకిస్తేనే కదా పంటలు పండేది. కన్నీళ్ళతో తడిపితే ఎలా ఉంటుందన్న ఆలోచన కవికి కలిగింది. అప్పుడైనా నేల చిరునవ్వుతో పురుడు పోసుకొంటుందేమో! ఇదీ పృథ్వీ ఆలోచన, ఆశయం. సమాజం కోసం ఏదో చేయాలన్న తపనలోంచి తన్నుకొచ్చిందీ భావం.

నాగరికత పెరుగుతూన్న కొద్దీ, సాంకేతిక విప్లవం ఒళ్ళు విరుచుకొంటున్న కొద్దీ అనుబంధాలు అడుగంటుతున్నాయన్న ఆవేదన ఇదే గజల్‌లో అయిదవ షేర్‌లో కనిపిస్తుంది. గజల్ పూర్తిగా చదివితే కవి తాలూకు ధ్యేయమేమిటో విశదమవుతుంది.

"చీకటి కోనల నిండా ఉచ్చుల గమ్మత్తు లేకద
గాయపడకుండా మానవతను దాస్తవని చూశాను"

ఇది మరొక గజల్‌లోని షేర్.

వర్తమానమంతా వడగాడ్పులతో నిండిపోయింది. చీకట్లలో అన్నీ బుసలు కొడుతున్న పన్నగాలే! ఈ నేపథ్యంలో ఎలాగైనా సరే మనిషితనాన్ని దెబ్బ తగలకుండా రక్షించుకోవాలి. పై షేర్‌లో కవి ఆశయమిదే. అంటే మనిషిని,

మనిషిగా చూడాలన్నది కవిగా పృథ్వి కోరిక.

ఈ నాటి ఆకాంక్ష స్వచ్ఛభారత్. అందరూ ఆమోదించిన పరిణామమిది. ఆకాంక్ష అందాల రంగవల్లి కావాలి. ఆనందాల హరివిల్లుగా హత్తుకోవాలి.. అప్పుడే జీవన సంక్రాంతి.

"ఇంట, బయట చెత్తను ఏరి, మురుగును తోడి
పల్లె ముంగిట ముగ్గులమై ఆడుకొందామా!"

అనే షేర్‌లో ఆ కోరిక ప్రబలంగా వ్యక్తమవుతున్నది. "ముగ్గులమై ఆడుకుందామా" అనే ప్రయోగం పఠితలను ఆకట్టుకొంటుంది.

కోయిల రాకపై కవికి ఒక ఆశ ఉంది. శిశిరం తరువాత వచ్చే చైత్రానికి ప్రతినిధి కోకిలే కదా! అందుకే ఒక గజల్‌లో పృథ్వి కలం ఇలా అంటోంది.

"ధన ప్రవాహాన మనిషి జాడలు మరుగవుతున్నవి చూడు
మనిషి బ్రతుకున దిగులు కూత చెరిపేయ వచ్చావా కోయిల"

ధన వ్యామోహంతో మనిషితనం మసక బారుతోంది. క్రమక్రమంగా మానవత్వం మడమ త్రిప్పుతోంది. ఆ దిగులు కూతను చెరిపేయటానికి వచ్చావా కోయిలా, అంటూ ఆశతో చూస్తున్నాడు కవి. తన పరిస్థితికి తానే సిగ్గుపడుతూ ఇలా ఒక పక్షివేపు ఆశగా చూడవలసి వచ్చింది.

ఇక్కడ ఆత్మ పరిశీలనా ద్వారాల్ని తెరుచుకో మంటున్న ఉద్బోత ఊరేగుతూ కనిపిస్తుంది.

ఇలా ఎన్నో ప్రబోధాత్మకమైన గజళ్లు ఈ పుస్తక శాఖపై నుండి కుహూ కుహూలు ఆలపిస్తున్నాయి. రసహృదయులే ఆ స్వరాల్ని ఆలకించ గలరు. తాళగతిని పోషిస్తూ గజల్ లక్షణాల్ని ఎక్కువగానే కాపాడుతూ, సమాజాభ్యుదయానికి హారతులు పట్టిన **పృథ్విని** అక్షరాలా అభినందిస్తున్నాను. గజలులో ప్రజలను చూపిన కలంతో కరచాలనం చేస్తున్నాను.





డా॥ యం.బి.డి. శ్యామల
ఇం.నెం. 8/384/13, శ్రీనగర్ కాలనీ,
అంగలకుదురు-522211, తెనాలి మండలం,
గుంటూరు జిల్లా, సెల్ : 9949777818

# ఓ సమసమాజీకుని కలం కన్న కలల గజళ్ళు!

'గజల్' ఓ ఎడతెగని ప్రేమలేఖ! ఓ భగ్నహృదయం పాడే విషాద సౌందర్యం! సమాజంలోని ఎడారి హృదయాలను సేద్యం చేయలేని వో సుకుమార సుందర హృదయం అదృశ్య శాసకుడి ముందు చేసుకునే చివరి విన్నపం! ఇంకా విశదీకరించి చెప్పాలంటే... జీవితసారాన్ని మదించి తీసిన నవనీతాన్ని అక్షరాలుగా కూర్చితే అది గజలౌతుంది! 1966లో దాశరథి గారు తెలుగు తోటలో నాటిన యీ గజల్ గులాబి... డా॥ సి.నారాయణరెడ్డి వంటి మహనీయుల పోషణ వల్ల తెలుగు రంగులద్దుకొని యిటీవలే విరగబూస్తోంది! ఒకప్పుడు భగ్నప్రేమ ప్రధాన వస్తువైన గజల్ 'సినారే' గారు చెప్పినట్లు ప్రేమ ప్రపంచంలోంచి ప్రపంచ ప్రేమలో పడింది!

ఇక పృథ్వీగారి గురించి! వచన కవిత, మినీకవిత, దీర్ఘకవిత, పద్యం, పాట, ముత్యాలసరం, రుబాయి, హైకూ, నానీ, నానో, కూనలమ్మ పదాలు, సాహిత్య సామాజిక వ్యాసాలు, సమీక్ష, కథ, నాటిక గజల్ మొ॥న అనేక రకాల సాహిత్య ప్రక్రియలలో మహోత్సాహంగా పదమూని ప్రయాణిస్తున్న నిత్య సాహిత్య పథగామి!

రుబాయీలు రాయగలిగిన వారికి, ముత్యాలసరం నడక తెలిసిన వారికి, గజల్ వ్రాయడం కష్టమేమీ కాదు! గజల్ వస్తువు విషయంలో సి.నా.రె. గారిలా సామాజికాంశాలనే పృథ్వీగారు స్పృశించినట్లు మనకు ఏ గజల్ చూసినా స్పష్టమౌతుంది!

"గొంతుతడి ఆరి నేల తల్లి సొమ్మసిలితే
ఎదను తడపగ ఏరువై పారాలని అనుకో!"

"అవినీతి, ఎదని కోసి మీది మీది కొస్తున్నా
ధర్మం జతను వీడకుండా నడవాలని అనుకో!"

అనేది వీరి జీవితాశయం! మరొక జగల్‌లో...

"కాలం కనుల ముందు కదులుతా ఉంది
వింతలను మనిషి ముందర నిలుపుతా ఉంది'

'నయవంచన చక్కని బొట్టుగ మారి
రాజకీయం నుదుట వెలుగుతా ఉంది'

"కారణాలన్నవి ఏమి చెప్పినా సరేనోయ్ పృథ్వీ!
కాసుల ముందర ఈ లోకం మోకరిల్లుతా ఉంది!!" అంటారు.

కదిలే కాలం మనిషి కళ్ళముందు నిలిపే వింతల్లో ఒకప్పటి నిస్వార్థ రాజకీయం నయవంచనగా మారిపోవడం ఒకటి! కారణమేమైనా... ఎవరైనా... కాసుల ముందర మోకిరిల్లే వింత జాడ్యం! మన నేటి దేశ స్థితిని కళ్ళకు కడ్తుంది. ఇటువంటిదే మరొక గజల్ యిది!

'ఇలలో సమస్యలు గోడకి కొట్టిన బంతులు కదర!
చెప్పెడి పరిష్కారాలు రాజకీయపు తంతులు కదర!

'తెలుగు నేలపై పండిన వరి గింజలను మానేసి
డాలరే ఆహారమని తింటే వాంతులు కదర! అంటూ లోక రీతిని వ్యంగ్యంగా కళ్ళకు చూపిస్తారు!

మహాకవి గాలిబ్ ఒక గజల్‌లో అంటారు. నరుడు నరుడౌట దుష్కరము సుమ్మి! అని! ఈ క్రింది పృథ్వీగారి మత్లా దాన్ని గుర్తు చేస్తుంది!

"నువ్వు నువ్వుగానే బతకాలని అనుకో!
నీ నవ్వుతో చెలిమిని గెలవాలని అనుకో"!

.................................

...................................

"నయవంచనకి నడక వచ్చిన రోజులివి!
నమ్మకాన్ని పెంచి పంచాలని అనుకో! అంటారు!

మనిషి మనిషిగానే బ్రతకడం, నవ్వుతో స్నేహాన్ని గెలుచుకోగలగడం, నమ్మకాన్ని పంచి ఎదుటి మనిషిలో దాన్ని పెంచడం, వాంఛింపదగ్గ పరిణామాలు!

శ్రీశ్రీని అమితంగా అభిమానించే పృథ్వీగారు ఒక గజల్ శ్రీశ్రీ మీద వ్రాయడం ముదావహం!

'అక్షరాలను శక్తి నింపిన నక్షత్రములుగ చల్లి
లోకాంధకారమ్మును చీల్చితివి గదయ్యా శ్రీశ్రీ!!"

...................................

......................................

'పెన్నును, గన్నుగ జేసి పేదల పక్షమున దన్నుగ నిలిపితివి
కష్టించెడి, కన్నీటికి విలువ పెంచిన కవివి గదయ్య శ్రీశ్రీ!!'

శ్రీశ్రీ కవితాశక్తికి, శ్రామిక పక్షపాతానికి అద్దంపట్టిన గజల్ యిది!

గుర్తింపులేనిచోట త్యాగం, రాగం ఏదైనా ఎలా వ్యర్థమవుతాయో ఓ గజల్‌లో అందంగా వ్రాశారు పృథ్వీగారు! ఈ గజల్ ఆసాంతం బాగుంది! మచ్చుకి రెండు షేర్లు చూడండి!

"కాంతులకి విలువేమున్నది కనులు లేని చోట
స్నేహానికి విలువే మున్నది సఖులు లేని చోట'

"మానవతా పుష్పాలు రేకులు రాల్చుతుంటే
మనిషికి విలువేమున్నది మంచి లేని చోట"

చూసే కళ్ళే లేకపోతే కాంతులకి విలువేం వుంది? స్నేహితులే ఆలంబనగా లేని చోట స్నేహానికి విలువేముంది? మానవత్వమే లేనిచోట మంచితనం లేనిచోట మనిషికి విలువేముంది? అంటూ సాగే గజల్ ప్రస్తుత సమాజపు తీరుని ఎత్తిచూపుతోంది?

ఈ సంపుటిలో పృథ్వీగారికి అత్యంత యిష్టులైన ఇటీవలే స్వర్గస్థులైన పెద్దలు, గజల్ కవి, విమర్శకులు అయిన అద్దేపల్లి రామ్మోహనరావు గారి పైన ఒక గజల్ ఉండడం విశేషం! ఇంకా ఉగాది, కోయిల, ప్రపంచీకరణ, ప్రేమ, అనుబంధాలు, రాజకీయాలు ఇలా వైవిధ్యాంశాలను గజళ్ళుగా పృథ్వీగారు యీ సంపుటిలో మలచారు. సమసమాజ కాంక్ష, మానవీయ విలువలకై ఆవేదన, మంచిని పెంచాలనే ఆశంస, మనిషిని ప్రేమించాలనే తపన యీ గజళ్ళలో అడుగుడుగునా కనబడుతూ పృథ్వీ గారి వ్యక్తిత్వ పరిమళాన్ని మన మనసుకు అనుభూతం చేస్తాయి! గజల్ నిర్మాణ పద్ధతిలో మరింత శ్రద్ధ తీసుకొని మున్ముందు పృథ్వీగారు ఇంకా చక్కని గజళ్ళు వ్రాస్తారని ఆశిస్తూ... అభిమానంతో.. వో మాట వ్రాయమని అడిగిన వారి ఆత్మీయతకు అంజలిస్తూ.... అభినందిస్తున్నాను.



జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**డా॥ సి. నారాయణరెడ్డి,** ఎక్స్ ఎం.పి.,
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.,
అధ్యక్షులు
తెలంగాణ సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్, హైదరాబాదు – 500 001.
ఫోన్ : (అ) 24753724



# ఆశీస్సులు

ఈ కవితా సంపుటిలోని ఇరవైయవ కవితలో ఎస్. ఆర్. పృథ్వి అంటాడు.

"నువ్వు నువ్వు గానే బ్రతకాలని అనుకో
నీ నవ్వుతో చెలిమిని గెలవాలని అనుకో" అని.

మానవ జీవితంలో స్నేహానికున్న పారమ్యం పృథ్వి, పై పంక్తుల్లో తెలిపినాడు. ఈ కవితలోనే పృథ్వి ఇట్లా అంటాడు.

"మాటల మాటున మలినాన్ని దాచిపెడతారు
చూపు వెన్నెల తోడ తొలగించాలని అనుకో" అని.

ఎస్. ఆర్. పృథ్వి నిరంతర కవితా రచనకు నా ఆశీస్సులు.

(డా॥ సి. నారాయణ రెడ్డి)

# అభిలాష

పద్యం తోటి సాహిత్యంలోకి ప్రప్రథమంగా అడుగు పెట్టాను. అయితే త్రిమూర్తులకు మల్లె ప్రకాశిస్తున్న శ్రీశ్రీ, దాశరథి, సి. నారాయణరెడ్డి గార్ల పుస్తకాలు నా దారిని వచన కవిత్వం వైపు మళ్ళించాయి. 1986లో దాశరథి గారి 'జ్వాలా లేఖిని' కంట పడింది. పద్యంలాగ కనిపించే 'రుబాయి' మీద కన్ను పడింది. పెద్దల ప్రోత్సాహంతో చాలా 'రుబాయి' కవితల్ని వ్రాసి, ప్రకటించాను. తెలుగు రుబాయిని రూపొందించిన కొద్ది మంది కవుల పంక్తిలో తగిన పీట వేసుకున్నాని డా॥ సి. నారాయణరెడ్డి గారు అభినందించారు.

ఆ తర్వాత కాలంలో డా॥ నారాయణరెడ్డి గారి గజళ్ళు వరుసగా పత్రికలలో వచ్చేవి. అవి చదువు తున్నప్పుడు నాకు వ్రాయాలని అనిపించింది. జ్వాలాలేఖిని దగ్గర పెట్టుకుని, కొన్ని గజళ్ళు వ్రాసాను. అప్పటి నుండి నా గజళ్ళకి డా॥ సి.నారాయణ రెడ్డి గారు స్ఫూర్తి ప్రదాత. కీ.శే. దాశరథి గారు మార్గదర్శి. వారిరువురు కవితా రంగాన నాకు ఆరాధ్యులే. వారికి నేనెన్నడూ ఋణపడే ఉంటాను.

'గజల్' గురించి ఒకమాట చెప్పాలి. ఇది అరబ్బీ భాషలో ఆవిర్భవించి ఫారసీ సాహిత్యంలోకి ప్రాకిందని, అక్కడ నుండి తుర్కీ, ఉర్దూ భాషలలోకి వ్యాప్తి చెందిందని దాశరథి గారు అంటారు. అటువంటి 'గజల్' ప్రక్రియను దాశరథి గారు తెలుగుకి పరిచయం చెయ్యడం, అనేక మంది దాని వెంట నడవడం, అందులో నేనొకడిని కావడం నా అదృష్టం.

'గజల్' అనే శబ్దానికి 'ఇంతులతో మంతనాలు' అని అర్థం. అయితే పెద్దలు చెప్పినట్టు, సామాజికత మీదికి కలాలు కదలటం ఒక మంచి పరిణామం. ఆ పరిణామమే నాకు ఉపకరించింది. అనేక 'గజల్' కవితలల్లడానికి ఊతమిచ్చింది.

ఈ చిన్ని పుస్తకం ముద్రించాలను కున్నప్పుడు, అడగ్గానే హామీనిచ్చి, నన్ను ముందుకు నడిపిన సోదర సమానులు **శ్రీ శీలం చక్రవర్తి, శ్రీ శీలం రమేష్** లకు మనఃపూర్వక ధన్యవాదాలు.

అడగగానే **"ఓ సమసమాజీకుని కలం కన్న కలల గజళ్ళు"** అంటూ విశ్లేషిస్తూ అక్షరాలలో ఆప్యాయతను ప్రకటించిన సోదరి **శ్రీమతి డా॥ యం.బి.డి. శ్యామల** గారికి, ఓపికగా ప్రతి గజల్ చదివి, సూచనలు చేస్తూనే, నా అక్షరాలతో **'కరచాలనం'** చేసి ప్రోత్సాహపు కితాబు నిచ్చిన ఆప్తులు, సన్నిహిత మిత్రులు, సినీకవి, **శ్రీ రసరాజు** గారికి, అన్ని గజళ్ళు చదివి, **ఆశీస్సులు** అందజేసిన పెద్దలు, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత **డా॥ సి. నారాయణ రెడ్డి** గారికి హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తకానికి రూపురేఖలు అద్దిన మిత్రుడు టి. శ్రీనివాస్‌కి, అందంగా ముద్రించి యిచ్చిన మిత్రులు శ్రీ డి.టి.పి. రాజు మరియు వారి సిబ్బందికి **ధన్యవాదాలు.**

నా 'రుబాయి' రచనను ప్రోత్సహించిన విధంగానే ఈ గజళ్ళను కూడా సాహితీ లోకం ఆదరించి, ప్రోత్సహిస్తుందని అభిలషిస్తున్నాను.

యస్సార్. పృథ్వి

# గజళ్ళ పయనం

1. త్యాగాల ప్రతిఫలమైన
2. మట్టిలోంచి మాణిక్యాలను
3. మోడువోయిన చెట్టేరా
4. మదిని ఊహల కొలనులో
5. కాలానికి ఆగెడి
6. కోపమెస్తే నీవు
7. ఓటుల గేలానికి
8. ఉగాది వచ్చిందని
9. కాలం కనుల ముందు
10. వెన్నెలంతా వేడిగా
11. మనుషులందరు ఒక్క మాదిరిగ
12. కాలమెన్నడు నడకలో
13. వాస్తవాలు పలకరించితే
14. ప్రతి జీవికి ఉంటుంది
15. ఇలలో సమస్యలు
16. కనిపించని కాలం
17. పండుగ వచ్చిందని
18. కనులలో కాంతి రేఖ
19. విందైనా కనువిందైనా
20. నువ్వు నువ్వుగానే
21. జీవితమంతా వెన్నెల పూవునై
22. ఓట్లకోసం, సీట్లకోసం
23. పద్యపాదమ్ములపై
24. పచ్చని చెట్టుకు
25. ఏడనుండో చిలిపి గాలి
26. కాంతులకు విలువేమున్నది
27. కోరికలను వెంటబెట్టుకొని

## 1

త్యాగాల ప్రతిఫలమైన రూపం పాలి పోతుంది
వాంఛాజనితమైన స్వరాజ్యం కూలి పోతుంది

ఆశయాలు నాటితే చిగురించిన గులాబి
స్వప్రయోజనాల రాపిడికి రాలి పోతుంది

అభివృద్ధి ముఖం కొత్త రంగులు అద్దుకొంటూ
ప్రపంచీకరణ హంగులలో తేలి పోతుంది

అనుభవాలను పేర్చి కూర్చిన పూలమాల
స్వార్థం నిప్పురవ్వలు పడి కాలి పోతుంది

అన్నదమ్ములమై పెంచుకున్న అనుబంధం
రాజకీయ రాక్షసి గోళ్ళకి చీలి పోతుంది

తూరుపున ఉదయించిన చిగురుటాశ
మొలకెత్తకనే పశ్చిమాన వాలి పోతుంది

అడుగడుగున వంచన జరుగుతోందిర ఓ పృథ్వీ
శిరమెత్తిన చాలు బతుకు చాపం పేలి పోతుంది

(సాహిత్య ప్రస్థానం - జూలై 2009)

## ౨

మట్టిలోంచి మణి మాణిక్యాలను ఎంచాలని ఉంది
చీడపట్టిన మనసు రెమ్మలను త్రుంచాలని ఉంది

రగులుతున్న అంతరాల పోరుపైన నీళ్ళు చల్లి
కోపతాపాల మంటలను చల్లబరచాలని ఉంది

చెదిరి పోతున్న అనుబంధాలను దరి చేర్చి
తేనెవంటి హృదయాన్ని జత పరచాలని ఉంది

నీడ కోసం పోరుసలిపెడి పేదవాళ్ళ అడుగులకి
అడ్డు పడుతున్న ముళ్ళనేరి తొలిగించాలని ఉంది

ఎగసిపడుతున్న అపశ్రుతి కెరటాల నడ్డుకొని
వాస్తవాల జాడల్ని ఎరుక పరచాలని ఉంది

వేడి నెత్తురుతో తడిసినా, నేలను దున్ని ఓ పృథ్వీ
సగటు మనిషి కోసం శాంతిని పండించాలని ఉంది

(ఆదివారం విశాలాంధ్ర - 21-10-2007)

## ౩

మోడువోయిన చెట్టేరా ప్రేమ లేకుంటె
ఎండుటాకు జీవితమేరా సిరి లేకుంటె

ఆశలు ఎన్ని దారుల వెంట పరుగులు తీసిన
చుక్కైనా రాలదు నేలను, మబ్బు లేకుంటె

ఊహలెన్ని మనసుతో ఊసులే ఆడిన
చెదిరి పోవునవి నిలకడగ నీవు లేకుంటె

రాజులెందరో మారి మనమే పాలకులమైనను
కన్నీరు తుడవ బోరెవరు సొంత లాభము లేకుంటె

తుమ్మెద ఝుంకరించును పువ్వు కంటబడితే
ఫలమేమున్నది ఆస్వాదించ మధువు లేకుంటె

కలలోనైన, ఇలలోనైన కన్నీరే గదర
బ్రతుకు యాత్రలోన నోటికి ముద్ద లేకుంటె

ఏళ్ళెన్ని గడిస్తే ఏముందిర ఓ పృథ్వీ
గత అనుభవాలు మనసున లేకుంటె

(విశాలాంధ్ర సాహిత్యానుబంధం - 06-06-2005)

# 4

మదిని ఊహల కొలనులో ముంచ లేను
కలనైనా సరే నిను వేరుగ ఉంచ లేను

అన్నిటను నీవే నిండి ఉందువందురు
ఏ రూపున ఉందువో మరి ఎంచ లేను

ఏయే తావులందు దాగితివో నీవు
కనిపింతువను ఆశను త్రుంచ లేను

నీ తలపులు మదినిండా ముసురుతున్నవి
వేరు చేసి, మనసింకొకరికి పంచ లేను

జగమున వాదములెన్ని తల ఎత్తిన
నీ ఉనికికై వివాదములు పెంచ లేను

మానవుడినై మసలుతున్న తరుణంలో ఓ పృథ్వీ
సకల లోకాలు పాలించు లీలలను కాంచ లేను

(కళా దీపిక - జనవరి 2005)

## 5

కాలానికి ఆగెడి స్వాతంత్ర్య మెక్కడిదే కోయిల
మనిషి జీవితమంతా పరుగు పందెమయ్యిందే కోయిల

రాజకీయం రాజై రోజును కాలచక్రంలో తిప్పుతోంటే
మనిషి జాతి పలు రంగు లేసుకుని వెలుగుతున్నదే కోయిల

విశ్వమంతా ఉండగా అరచేతలో అమరి పోతుంటే
కోరికలు అదుపు తప్పిన గుర్రమౌతున్నదే కోయిల

స్వార్థం మెదడు వేదికెక్కి తైతెక్క లాడుతుంటే
విలువల వలువ కాస్తా జారిపోతున్నదే కోయిల

కనుల కొలనుల్లోకి కన్నీరు వరదై చేరుతున్నా
బడుగు గుండెపైన బతుకు మొక్క మొలవదేమి కోయిల

ఏడాదికి రెండు మార్లు మువ్వన్నెల జెండా ఎగుర వేస్తున్నా ఓ పృథ్వీ
అలసిన మా బతుకుల నుండి బానిసత్వపు మరకేల తొలగకున్నదే కోయిల

(పత్రిక – నవంబరు 2008)

## ౬

కోపమొస్తే నీవు కోయిలవై పాడాలని అనుకో
విసుగు చెందితే భూదేవిలా నిలవాలని అనుకో

అన్యులు గోదావరిపై పయనించు వేళ
పడవకి తెరచాప అవ్వాలని అనుకో

ధూర్తులు నీతి గుండెకు గురి పెట్టినపుడు
నిజాయితీ చెట్టువై అడ్డుపడాలని అనుకో

పొలిమేరని ఉగ్రుల చొరబాటు తాకినపుడు
సరిహద్దు వెంట తుపాకీవై నిలవాలని అనుకో

గొంతు తడి ఆరి నేల తల్లి సొమ్మసిలితే
ఎదను తడపగ ఏరువై పారాలని అనుకో

స్వార్థం తీయని పాలలా ప్రవహిస్తూ ఉంటే
విరిచేందుకు నీవు పులుపువై కలవాలని అనుకో

అవినీతి, ఎదనుకోసి మీది మీది కొస్తున్నా
ధర్మం జతను వీడకుండ నడవాలని అనుకో

ధైర్య సాహసాలకు తీపి గురుతుగ ఓ పృథ్వీ
త్రివర్ణ పతాకవై స్వేచ్ఛగ ఎగరాలని అనుకో

(చైతన్య కవిత-బెంగుళూరు)

## 7

ఓటుల గేలానికి హామీల ఆశలెన్నో చుడతారు
గెలుపు ఖాయమయ్యాక ప్రజల నసీబుతో ఆడతారు

పాలనలో స్వప్రయోజనాలు పరిమళించేందుకు
నీతి తప్పిన సరికొత్త దారుల వెంట పడతారు

పేదల బతుకు బాటపై పదవుల తివాసీ పరుచుకుని
పలుకుల చినుకుల తోడ మిథ్యామహళ్ళు కడతారు

అబద్ధాలను మంచినీటి చెలమలుగా మార్చేసి
ప్రజల ముందు మధురమైన పాటలెన్నో పాడతారు

నిజాలను భుజాన వేసుకుని ఎదురొడ్డిన వారిని
మనసు గాయపర్చెడి మాటల కొరడాతో కొడతారు

త్యాగాలను అనకొండై మ్రింగిన రాజకీయంర ఓ పృథ్వీ
క్షణానికో రంగేసుకుని ప్రజల ముందు బోర్లా పడతారు

....

## 8

ఉగాది వచ్చిందని సంబర మెందుకే కోయిల
ఉదయ రాగంలోన ఆ చేదెందుకే కోయిల

రోజువారీ నడకలో అపశ్రుతులెన్నో ఉన్నవి
రాజువై వాటి తలలను త్రుంచ వెందుకే కోయిల

ఊరూర వనితల బ్రతుకులెల్ల కూలి పోతున్నవి
ఊరక కూని రాగాలు తీయుటెందుకే కోయిల

విద్య, వినయాలు కవల పిల్లల వంటి వారేగా
విద్య నేర్చిన ధూర్తులను ఆపవెందుకే కోయిల

జీవితాలు ఆకుపచ్చగా మారాలిర ఓ పృథ్వీ
జీవన గతిలోన విష బిందువు లెందుకే కోయిల

(దేవాంగ పత్రిక – ఏప్రిల్ 2013)

## 9

కాలం కనుల ముందు కదులుతా ఉంది
వింతలను మనిషి ముందర నిలుపుతా ఉంది

ఏ క్షణం ఏమౌతాదో తెలియని వేగంలో
సగటు బ్రతుకు చీకటిలో కరుగుతా ఉంది

సంస్కృతి కన్న కలలన్నీ చెదిరిపోయి
వంటి మీద గుడ్డేమో నలుగుతా ఉంది

నయవంచన చక్కని బొట్టుగ మారి
రాజకీయం నుదుట వెలుగుతా ఉంది

అవినీతి అడుగుల చప్పుడు వింటూ వుంటే
మనసులోని మౌనం బ్రద్ధలవుతా ఉంది

పంతమో మరది పట్టింపో ఎవరికి తెలియును గాని
పేలుతున్న ప్రతి తూటాకి నేల ఎర్రబడుతా ఉంది

కారణాలన్నవి ఏమి చెప్పినా సరేనోయ్ పృథ్వీ
కాసుల ముందర ఈ లోకం మోకరిల్లుతా ఉంది

(ఆకాశిక్ - మార్చి 2009)

## 10

వెన్నెలంతా వేడిగా అనిపిస్తోంది
వెన్నకూడా చేదుగా అనిపిస్తోంది

ఏ తోటలో పూలచాటున దాగితివో
శ్రమని తోసి వెదకాలని అనిపిస్తోంది

చూపు సోకని తీరాల కేగితివేమొ
మనోనేత్రం విప్పాలని అనిపిస్తోంది

కనిపించని చీకటి చాటుకు పోకు
ఆశని దివ్వె చేయాలని అనిపిస్తోంది

దాగిన దారులు మూయాలని చూడకు
గాలినై నిను చేరాలని అనిపిస్తోంది

నా రాక నెరిగిన నీవు రాయివై విలువకు
చూపులతో కరిగించాలని అనిపిస్తోంది

ఏ మార్గాన ఉన్నా సరేనోయ్ పృథ్వీ
ప్రేమనై నిను చేరాలని అనిపిస్తోంది

(మూసీ - జూన్ 2013)

## 11

మనుషులందరు ఒక్క మాదిరిగ ఉండరుగ
మమత చిగురించినా జాతిపిత లాగ ఉండరుగ

జన్మనిచ్చెడి అమ్మ నాన్న లొక్కరే అయిన
జన్మించెడి బిడ్డ లందరు ఒక్కలాగ ఉండరుగ

నమ్మెడి దైవంలోని శక్తి ఒకటే అయిన
దేవత లందరు ఒక్క రూపముగ ఉండరుగ

ప్రజల పాలన కోసమే రంగు పులుముకున్న
సిద్ధాంతాల్లో, ఒక్క మాదిరిగ ఉండరుగ

లోకాన మనుషుల నడకే వేరురా పృథ్వీ
శిక్షించే వారెల్లరు ఒక్క విధముగ ఉండరుగ

## 12

కాలమెన్నడు నడకలో తడబడదేమి కోయిల
వసంత రాగమెక్కడ వినపడదేమి కోయిల

శాంతి వచనాల నేరి నేలంతా చల్లుతున్న
నరమేధ మాగిన జాడ కనపడదేమి కోయిల

స్వార్థం అనంత రూపాలలో మీది కురుకుతోంది
మానవత్వం, ఖడ్గమై తలపడదేమి కోయిల

మామిడి కొమ్మ పూతైతే పూస్తున్నది గాని
మనిషిలో మమకారం చొరపడదేమి కోయిల

కాగితపు పూలపైనే మోజులు పెరిగాయి
ప్రకృతిని కాయు దారగుపడదేమి కోయిల

ధనం కోసం మనిషి లోరూపు మారిపోతోంది
మోసాలను నిలిపే  గుణ మగుపడదేమి కోయిల

షడ్రుచులతో ఉగాది పచ్చడి సిద్ధమౌతోంది
బంధాన మనిషి జాడ కనపడదేమి కోయిల

సగటు మనిషి బ్రతుకుని భూటకం చేసింది
ఆటలాడు ముఖానికి తెరపడదేమి కోయిల

వినగ లోకాన సమస్యలు కోకొల్లలుర ఓ పృథ్వీ
ఉగాది సంబరాన నిజాల జాడ అగుపడదేమి కోయిల

(శ్రీ కళా గౌతమి - జూలై 2013)

## 13

వాస్తవాలు పలుకరించితే కొందరికి భయమే గద
అవాస్తవాలు కంటపడితే ఇంకొందరికి భయమే గద

విషము గ్రక్కెడి పామును సైతము ఆడిస్తారు
కడుపులోని ప్రేగుల కేకలంటే భయమే గద

కాలమెంత వేగముగా ముందుకురికినా సరే, మరి
అక్షరాలను కురిపించే కలాన్ని చూస్తే భయమే గద

పాపాలెన్నిటినో మూటలుగ కడతారు
భగవంతుడు తలపుకు వస్తె భయమే గద

ప్రకృతిలో అందాలు చూచి మైమరచి పోతారు
ఒళ్ళు విరుచుకుంటె అణువణువునా భయమే గద

లోకాన్ని చూసి కలత చెందకురా ఓ పృథ్వీ
లోకులు కాకులై మాటల పాడిస్తే భయమే గద

(ఆకాశిక్ - జూన్ 2005)

## 14

ప్రతి జీవికి ఉంటుంది నిండుగ బ్రతకాలని
లోకం తెరమీద తన రూపం నిలవాలని

చీకటి బారిన పడిన విలువలపైకి మెరుపు తీగెను పంపి
కొందరైన అనుకుంటారు మంచి తనంతో నడవాలని

మనసు మీద పడిన కలిమి కోరికలను తుడిచేసి
తపిస్తారు చెలిమి మార్గాన నిలకడగ నిలవాలని

బతుకు బాటలో పడిన ముళ్ళరెమ్మలను ఏరి
శ్రమిస్తారు మమతల పూలను చల్లాలని

ఆకలి కేకలకు తెగిన తీగెల నెల్ల సవరించి
దీక్ష పూనుతారు మధుర స్వరాలు పలికించాలని

జనులందరూ కలిసి మెలిసి అడుగులు వేసినప్పుడు
ఉవ్విళ్ళూరును మనసు, ప్రేమ మందిరమును తెరవాలని

జీవితము తీపిని ఊరిస్తూ సాగిన వేళ ఓ పృథ్వీ
కళ్ళు రెండూ వేనవేలుగ మారును భవితను చూడాలని

(ప్రజాశక్తి - 24-4-2005)

## 15

ఇలలో సమస్యలు గోడకి కొట్టిన బంతులు గదర
చెప్పెడి పరిష్కారాలు రాజకీయపు తంతులు గదర

మద్యము మడుగుల్లోన ఈదులాడెడి వాళ్ళు
ఎంతటి వాళ్ళైన చెడుతాయి మతులు గదర

సంస్కృతి సంప్రదాయలను గెంటి వేస్తే
ముగ్గులు చెదిరి, వాకిలంతా గోతులు గదర

తెలుగు నేల పైన పండిన వరి గింజలను మానేసి
డాలరే ఆహారమని తింటే వాంతులు గదర

అమెరికా, అమెరికా యని ఆత్రంగ అర్రులు చాస్తేను
నీ కట్టెకు అక్కడుండే నిప్పు పెడతారు సుతులు గదర

మనిషి జాడలు మరుగున పడుతున్నవిర ఓ పృథ్వీ
మానవత లేని లోకాన నిలువవు కాంతులు గదర

## 16

కనిపించని కాలం ప్రవాహంలా సాగుతుంది
జీవితమేమొ వ్యర్థపదార్థంలా మిగులుతుంది

ధనార్జన జీవి లక్షణంగా విస్తరించి
మానవ సంబంధాలను నీట కలుపుతుంది

రాజకీయానికి స్వార్థం తోడైతేను
సామాన్యుడి భవిత రాచపుండు అవుతుంది

పట్టు పట్టి మనిషి సాధన చేసినపుడు
వెదురు బొంగైన సప్తస్వరాలు పలుకుతుంది

వేదాలు ఘోషించినా, వాదాలు శాసించినా
మలినం చేరితే మనసున మనిషితనం వాడుతుంది

సత్యం పైన కుట్రపన్నితే ఓ పృథ్వీ
అసహనం నిత్యం ఉప్పెనై పొంగుతుంది

(విజ్ఞాన సుధ - ఏప్రిల్ 2008)

## 17

పండుగ వచ్చిందని సంబర పడతారు కొందరు
ఊపిరి పోసిందని ఉత్సాహ పడతాడు కొందరు

నియమాలను తోసేసి నీతి జాడలను మింగేసి
చట్టంతో నిత్యం ఆటలు ఆడతారు కొందరు

ప్రజల సొమ్ము లెల్లను తమవిగానే యెంచి మింగినపుడు
పాపము పండి జైలు ఊచలనే లెక్క పెడతారు కొందరు

చేతి వృత్తులు కాలి, పస్తులు రగిలించెడి వేళ
గద్దె లెక్కి పాలించు వాళ్ళని తిడతారు కొందరు

వనితల ప్రాణమైన శీలాన్ని దోచేసి
రాక్షసుల వరుసలో నిలుస్తారు కొందరు

చెడు వ్యసనాల మడుగులో దిగబడినపుడు
అదే ప్రపంచమని భ్రమపడతారు కొందరు

విచ్చలవిడి తనం వెచ్చని కౌగిలి వంటిదిర ఓ పృథ్వీ
చెలిమిలోన మంచిని యెంచకుంటేను చెడతారు కొందరు

## 18

కనులలో కాంతిరేఖ మాయమౌవుతున్నదే చిలుక
కాలరేఖలో కాఠిన్యం ప్రవహిస్తున్నదే చిలుక

అవినీతి పెంపుడు బిడ్డై రాజ్యమేలుతుంటే
మనిషి బ్రతుకున వేదన పుడుతున్నదే చిలుక

అభివృద్ధి పేర రసాయన క్రియలలో వేగం పెరిగింది
భూమండలమేమొ అగ్నిగుండ మవుతున్నదే చిలుక

నిక్షిప్తాలను వెలికి తీసెడి ఆనందమున పడి పొర్లుతూ
కలుగబోవు కష్టాలను చూడ ఇచ్ఛగింపకున్నదే చిలుక

గగనాన విహరించు కోరికల కొలనులో పడి ఓ పృథ్వీ
పుడమి ఉనికిని తలవకనే చెరిపేస్తున్నదే చిలుక

## 19

విందైనా కనువిందైనా ఆనందము క లిగించును
మధురమైన ఊహలు సైతము ఆనందము కలిగించును

పూవు పూవును తాకి మకరందము ఆస్వాదించెడి
సీతాకోక చిలుకలు మదిలో తీపినే ఊరించును

మామిడి చిగుళ్లు తిని తీయని గానము చేసెడి
కోకిలల గొంతులు వసంత రేఖను కదిలించును

పచ్చి ఆకుల నారగించి పరవశించెడి పురుగులు
మదిని దోచెడి పట్టు వస్త్రానికి దారాన్ని అందించును

పదనుపడ్డ కొండీలతో పూలను గుచ్చెడి తేనెటీగలు
తీపి దనానికి రారాజైన తేనె చుక్కలను బంధించును

ప్రకృతి రహస్యాలెన్నెన్నో చూడగ ఇలలో ఓ పృథ్వీ
స్వార్థ జ్వాలలు తాకకుంటే జగాన అవి జీవించును

(కళాదీపిక - డిశంబరు 2010)

## ౨౦

నువ్వు నువ్వుగానే బ్రతకాలని అనుకో
నీ నవ్వుతో చెలిమిని గెలవాలని అనుకో

బ్రతుకున వెలితి అమావాస్య అవుతూవున్న
నవ్వుతూ ముందుకు సాగాలని అనుకో

నయవంచనకి నడకవచ్చిన రోజులివి
నమ్మకాన్ని పెంచి పంచాలని అనుకో

మాటల మాటున మలినాన్ని దాచి పెడతారు
చూపు వెన్నెలతోడ తొలిగించాలని అనుకో

ఆశలు కరిగి, వృత్తినైపుణ్యాలు ఆత్మహత్య లవుతున్నవి
ఆశయాల మొదళ్ళలో విశ్వాసం నింపాలని అనుకో

బడుగులు అడుగుల ఉనికిని కోల్పోతున్నారు ఓ పృథ్వీ
అడుగులకు మనిషి తనాన్ని నిండుగ పంచాలని అనుకో

(తెలుగు విద్యార్థి - జూన్ 2013)

**21**

జీవితమంతా వెన్నెల పూవునై వికసించాలని ఉంది
జీవనవేదంలోకి మెరుపునై ప్రవహించాలని ఉంది

ధనమే జీవమనెడి మత్తు ఊహల ఊయలను ఆపి
ఘనమైన మాయల హొయలును నేలకి దించాలని ఉంది

నెత్తురు మరిగిన తుపాకీ పులులకు ఎదురుగ నిలిచి
మెత్తని హృదయం తోడ శాంతిని ప్రకటించాలని ఉంది

రంగుల ముసుగు లేసుకున్న రాజకీయపు రొంపిని పట్టి
హంగులెరుగని మానవత్వపు చేతలతో ఎదిరించాలని ఉంది

గిరికోనల కొలువున్న మౌన ముద్రల ఉనికి నిలిపేందుకు
చీడపట్టిన ఆకులను మొదలంటగ త్రుంచాలని ఉంది

ఆధునిక ప్రపంచ వ్యామోహాల వాయువుల జిక్కి
చెదురుతున్న అనుబంధాలను నిలపాలని ఉంది

స్వార్థం, సుగంధాలు పూసుకొచ్చిందిర ఓ పృథ్వీ
మనిషి తనం హృదిలోకి చొరకుండ ఆపాలని ఉంది

## 22

ఓట్ల కోసం, సీట్లకోసం కొత్త దారులు ఎంచు కుంటారు
ముళ్ళున్న రహదారులనే మక్కువపడి మరీ ఎంచు కుంటారు

అధినాయకులమని వింత పోకడల సముద్రాన మునిగి తేలుతూ
ప్రజలతో ఉన్న అనుబంధాలను మొదటికే త్రుంచు కుంటారు

పాదయాత్రల పేరిట అభివృద్ధి భ్రమల పరిమళాలు చల్లి
సామాన్య జనుల మనోభావాల నెల్లను నంజు కుంటారు

పచ్చలు పొదిగినట్టి పదవుల కిరీటములను శిరమున ధరించి
కంటిచూపు మేర కనిపించినది తమదిగా పెంచు కుంటారు

అవినీతి మడుగులలో పడి మహదానందాన ఈదులాడుతూ
మానవత్వము నిండినట్టి మంచి బంధాలను త్రెంచు కుంటారు

ఎవరికి వాళ్ళు కొత్త మెరుపులతో కనపడాలని ఓ పృథ్వీ
కాలం కనుసన్నలలోనే ఆర్థికముగా పుంజు కుంటారు

(ఆదివారం విశాలాంధ్ర - 18-01-2015)

## 23

పద్య పాదమ్ములపై నడక ఆరంభించితివి గదయ్యా శ్రీశ్రీ
విశాఖ సముద్ర పవనము లీనివెంట నుండెడివి గదయ్యా శ్రీశ్రీ

అక్షరాలను శక్తి నింపిన నక్షత్రములుగ చల్లి
లోకాంధకారమ్మును చీల్చితివి గదయ్యా శ్రీశ్రీ

అక్షర సౌందర్యానికి పదచిత్రణ లెన్నో నేర్పి
పతితులకు, బాధితులకు దన్నిచ్చితివి గదయ్యా శ్రీశ్రీ

కలమనెడి హలము తోడ సాహితీ నిర్జీవపు నేలను దున్ని
భవితకు వలయు వనము లెన్నిటినో పెంచితివి గదయ్యా శ్రీశ్రీ

చలన చిత్రసీమ వేదికవగ తెర వెనుకనె ఆసీనుడవైతివి
అమృత పానము వంటి పాటల పంట పండించె గదయ్యా శ్రీశ్రీ

అక్షరాలను పదములుగా పేర్చి, సిపాయిలుగ నిలిపి
కార్మిక, శ్రామిక జనావళికి ఊపిరైతివి గదయ్యా శ్రీశ్రీ

పెన్నును, గన్నుగ జేసి పేదల పక్షమున దన్నుగ నిలిపితివి
కష్టించెడి కన్నీటికి విలువ పెంచిన కవివి గదయ్యా శ్రీశ్రీ

పాటలు రాసినా, కవితలే అల్లినా కాలం మోకరిల్లె గదర ఓ పృథ్వీ
సాహిత్యాన నవయుగాన్ని సృష్టించి నాయకుడ వైతివి గదయ్యా శ్రీశ్రీ

(నేటి నిజం 09-06-2016)

పచ్చని చెట్టుకు పువ్వు నవ్వాలని ఉంది
జగతి మెచ్చగ పరిమళించాలని ఉంది

కరిమబ్బు వంటి కాలపుటెదను చీల్చగ
మానవత్వపు మెరుపు కత్తి నవ్వాలని ఉంది

బీడు వారిన నేలతల్లి పాదాలను
కన్నీరునైన కార్చి తడపాలని ఉంది

స్వార్థం కంచె మాటున దాగిన రాజకీయాన్ని
పెనుగాలి తోడ ఉప్పెనై తాకాలని ఉంది

యంత్రమయమైనట్టి కలుషిత కాలమ్మును వీడి
పాత అనుబంధాలలోకి ప్రవహించాలని ఉంది

కాలంలోన కాంతి పుంజమై నిలిచేందుకు ఓ పృథ్వీ
దేశాగ్రభాగాన త్రివర్ణ పతాక నవ్వాలని ఉంది

(ఆకాశవాణి, కర్నూలు రేడియో ఏప్రిల్ 2011)
(చైతన్య కవిత 41, 42)

# 25

ఏడనుండో చిలిపి గాలి వీచినది
కొంటెగా ఈల వేసి పిలిచినది

ఈ వనమందున ఏ ఆకు కదలాడినా
నా ప్రేయసే రమ్మని నటుల తోచినది

కనుల కింపైన కలువల చెంత జేరి
రాక కోసం వేయి కన్నుల వేచినది

వెన్నెల కరిగి సన్నగ నేల కొరగగ
విరహపు మంటల సలసల కాచినది

ఊహా జగమున ఊయలలూగు సమయాన
ప్రేమ, కెరటమ్మై ఉవ్వెత్తున లేచినది

ఉరిమే మేఘమ్ములలో మెరుపై
ఊపిరాడని నన్నేగ  చూచినది

కానరాని తావులందు దాగుని ఓ పృథ్వీ
కనీ కనిపించకనే నా మదిని దోచినది

(నెలవంక నెమలీక.. అక్టోబర్, 2016)

## 26

కాంతులకి విలువేమున్నది కనులు లేనిచోట
స్నేహానికి విలువేమున్నది సఖులు లేని చోట

ఆలుమగల అనుబంధం నిండుగ తీపియే గద
మగడికి విలువే మున్నది ఆలి లేని చోట

మానవతా పుష్పాలు రేకులు రాల్చుతుంటే
మనిషికి విలువేమున్నది మంచి లేని చోట

ఆకశాన భానుడు నిప్పులు చెరుగుతోంటే
మబ్బుకి విలువేమున్నది వాన లేని చోట

మనిషి మదిని కలిమి బలిమియై పీడిస్తోంటే
దాతృత్వము చిన్నబోవును దాత లేని చోట

కిరీటానికై అంతర్గత సమరం సాగుతోంటే
నాయకులకి విలువేమున్నది పాలన లేని చోట

పెరిగిన స్వేచ్ఛ ఉచ్చులు పన్నుతోందిర ఓ పృథ్వీ
మంచి తనానికి విలువేమున్నది త్యాగం లేని చోట

(అమరం వార పత్రిక)

# 27

కోరికలను వెంటబెట్టుకొని వస్తావని చూశాను
మదికి పూచిన ఆశలను కోస్తావని చూశాను

కొండ కోనల బడి కనిపించకనే దాగిన
గండు మల్లెలను కోసుకొని వస్తావని చూశాను

పొదల మాటు నుండి సాధు జంతువులను వేటాడు
క్రూర మృగమ్ములను పట్టి బయటికి తెస్తావని చూశాను

చీకటి కోనల నిండా ఉచ్చుల గమ్మత్తులే గద
గాయపడకుండా మానవతని దాస్తావని చూశాను

మణులు మాణిక్యాలు కాదుగా నీకు కావలసింది
చిక్కకుండా సాహసంతో పైకి లేస్తావని చూశాను

ఇంట బయట దొరక్క తిరిగెడి శత్రువులేర ఓ పృథ్వీ
మనిషి బ్రతుకున మణివై నిలుస్తావని చూశాను

(నెలవంక నెమలీక – డిశంబరు 2016)

# 28

కమ్మని రూపమొకటి కనుల ముందర నిలిచి వున్నది మాస్టారు
కనుల కాంతిని వీడిపోనని అంటూ వున్నది మాస్టారు

ఒకటి కాదు, రెండు కాదు, మూడు దశాబ్దాల చెలిమది
కలిమి కంటే గొప్పదని చెబుతూ వున్నది మాస్టారు

మోముపై ఆహ్వానపు చిరునగవుల తరగల నెలా మరువగలను
ఆశ్వాదనలో మనసంతా తడుస్తూనే వున్నది మాస్టారు

కాలయముడి కౌగిలిలోన చిక్కుకుపోతే పోయారు లెండి
మీ కనుల కాంతి నన్ను వెంటాడుతూనే వున్నది మాస్టారు

మీరు లేరన్న దిగులు మనసంతా అలుముకున్నా
అక్షర జ్వాల వెలుతురులాగ వున్నది మాస్టారు

అక్షరానికి రూపమిచ్చిన ఆలోచనలెలా మరువగలను
ప్రపంచీకరణపైన ఎత్తిన కత్తిలాగ వున్నది మాస్టారు

ఊపిర్లనిండా అలుముకున్న ఆశ నమ్మకాన్ని చెలిపేస్తుందేమో
అయినా ధైర్యము విడువక ఆనవాళ్ళను వెతుకుతూ వున్నది మాస్టారు

రేపు ఉదయించటం కోసం నేడస్తమించిన తీరు ఓ పృథ్వీ
కవితా వనమందున సింధూర ఛాయలాగ వున్నది మాస్టారు

(గోదావరి ప్రతిబింబం... సంకలనం)

## 29

అమ్మ నుదుటి మీద ఉదయభానుడి వయ్యావు కదయ్యా
వెలుగు రేఖలు నింపెడి జలపాత మయ్యావు కదయ్యా

నేలను దున్నావు విత్తునే నాటావు
ఆకలి తీర్చగ రైతు వయ్యావు కదయ్యా

కష్టాన్ని యిష్టముగానే యెంచి, శిరమున మోసి
యింటి విస్తరిలో అన్నం మెతుకయ్యావు కదయ్యా

గంతు లేసెడి వింత కోరికలెల్ల యేరి, జల్లెడ పట్టి
విజయ మార్గాన నడిపించెడి జెండావయ్యావు కదయ్యా

బిడ్డల భవితాకాశాన వేగుచుక్కవై మొలిచి
తడబడు అడుగులకి ఆలంబనయ్యావు కదయ్యా

చీకటి ఛాయలు పారద్రోలగ దీపమును వెలిగించి
ప్రమిదందు తరుగుతున్న చమురు వయ్యావు కదయ్యా

పిల్లలకి ప్రేమను పంచి ఆప్యాయతల పల్లకిలో మోసి
బహురూపాల సాగెడి యాత్రకి జీవమయ్యావు కదయ్యా

స్మృతి వనమంతా పచ్చదనమై పరుచుకుంది పృథ్వీ
కమ్మని జ్ఞాపకాల వాగువయ్యావు కదయ్యా

# 30

చూడాలని అనుకున్నా చూడలేక పోతున్నాను
చెప్పాలని అనుకున్నా చెప్పలేక పోతున్నాను

పల్లె పందిరి నడుము విరిగి బోసిపోయిన అందము చూచి
నిలువ లేని మదికి తోడుగ ఉండలేక పోతున్నాను

కరిమబ్బు తెరలు తోడుగ పచ్చదనమును కూల్చి వేసిన
విషవాయువుల వెల్లువను ఆపలేక పోతున్నాను

అవినీతి అడవికి మల్లే పెరిగిపోతూ వున్నది
ఆయుధమేదైనా కూల్చలేక పోతున్నాను

జీవితము నిండా అలజడుల పిచ్చిమొక్కలెన్నో అల్లుకున్నవి
తొలిగించెడి దారగుపడక కన్నీరు తుడవలేక పోతున్నాను

మనిషి మెదడుకు డబ్బు మకిలి పట్టిందిర ఓ పృథ్వీ
ఒంటరి పోరులోన నే తుడవలేక పోతున్నాను

## 31

మావి చిగురేసిందని చూడగ వచ్చావా కోయిల
చైత్రం పలుకరించిందని మురిసి వచ్చావా కోయిల

తెగిపడిన తీగెల తావున నవనాడులను పేర్చి
రసరమ్య గీతికలను పాడగ వచ్చావా కోయిల

చెలిమి కుప్పె పగిలి గాయమయిన మదికి
లేపనము పూయగ గానమై వచ్చావా కోయిల

ధనప్రవాహాన మనిషి జాడలు మరుగవుతున్నవి చూడు
మనిషి బతుకున దిగులు కూత చెరిపేయ వచ్చావా కోయిల

మనసు చుట్టూ ఆశల వల పరుచుకుని వుంది
ఆశయాల రెక్కలు తొడగగ వచ్చావా కోయిల

వాగ్దానాల గూడు నిండుగ నిండిపోయినదిపుడు
పగులగొట్టి విముక్తి జేయ వచ్చావా కోయిల

తెగిపడిన గాలిపటమే గద మానవ విలువలు చూడగ
జారిపోయిన విలువలను జతగుచ్చగ వచ్చావా కోయిల

షడ్రచుల సారమే గదరా జీవితం ఓ పృథ్వీ!
మనిషిగ బ్రతికే పాఠాలు నేర్ప వచ్చావా కోయిల!!

## ౩౨

పల్లె లోగిలిలో పిల్లలమై ఆడుకుందామా
పరవశించీ పాటలెన్నో పాడుకుందామా

గోదారమ్మ ఒడిలో జలకాలే ఆడి
గుడిలోని శివయ్యని వేడుకుందామా

పిల్లలతోటి జతగట్టి యిస్కూలుకు పోయి
చదువుల తల్లి జ్ఞానాన్ని తోడుకుందామా

ఇంట బయట చెత్తను ఏరి, మురుగును తోడి
పల్లె ముంగిట ముగ్గులమై ఆడుకుందామా

ఇంటికొక మొక్కను నాటి, కంచెను గట్టీ
పచ్చదనం పరుపులపైన పడుకుందామా

చేతులు కలిపి చెంపలు నిమిరి ఓ పృథ్వీ
జగతి దారుల చెలిమి ఆటలు ఆడుకుందామా

## ౩౩

పొమ్మంటే ఏడకుపోను చెప్పు బావ
మౌనము వీడి మదిలో మాట చెప్పు బావ

నడిరేతిరి నిద్దురలోన నవ్వులు రువ్వావు
కలలో గిలిగింతలెవరో నాకు చెప్పు బావ

నగుమోము తోడ అడనడ గుసగుస లాడావు
కవ్వింతల ముంచిన గడసరెవరో చెప్పు బావ

వలపు సందిట కోరిక బిగియువేళ ననుదాచావు
ఎవరికోసమో నీ కనుల తపన చెప్పు బావ

నీ తలపులన్నీ నా మదిని తడుముతూ వున్నవి
నను వీడి నీ మనసేడకు పోయెనో చెప్పు బావ

వలపు పంటను గోసి చలువ పందిరి వేసాను
కవ్వించినా కదలని కారణమది చెప్పుబావ

ఊహలు విహరించెడి లోకాన్ని విడవాలి గదర ఓ పృథ్వీ
ఊహల తెరను కోసి వాస్తవములో అడుగు లేస్తానని చెప్పు బావ

# 34

చూపులతో వేధించెడి పలకరింపు నాకు వద్దు
మౌనమేఘాలలో ఒంటరి విహారం నాకు వద్దు

సంప్రదాయపు పరిమళింపుల ఆస్వాదన మానేసి
పెళ్ళిగాక సుఖాలను భవించు తలంపు నాకు వద్దు

ఆకలి కడుపుల ఆరాటం చూడలేకున్నాను
ఆకున వడ్డించిన పంచభక్ష్యాదులు నాకు వద్దు

ఆశల కొలనుకు అవినీతి పూలు జతచేసి
ఆనంద మనుభవించు రోజులు నాకు వద్దు

ఎప్పటి నుండో అనుకొంటున్నాను ఓ పృథ్వి
ఏదోలా జీవించడమనేది నాకు వద్దు!

## 35

తిన్నావా లేదా అని అడిగావా నీవు ఎన్నడైనా
జీవితాక్షరాలు నేర్పిన నాన్నను నీవు ఎన్నడైనా

పడుచుతనం కరిగి ముఖాన ముడతలు పడ్డాయి చూడు
కనిపెంచినమ్మను తలిచావా నీవు ఎన్నడైనా

అందము చెడినా బంధము వీడని మరో అమ్మేర
అర్ధాంగి మనసు చూచావా నీవు ఎన్నడైనా

కాలవాహినిలో నడక వయసు తరుగుతూనే ఉంది
బంధాన తీపి నింపావా నీవు ఎన్నడైనా

జీవితమంటే ప్రశ్నలు సమాధానాలే ఓ పృథ్వీ
పెద్దల వాక్కులాలకించావా నీవు ఎన్నడైనా

## ౩౬

లోకం పోకడ గురించి చెప్పొద్దు నాకు
లోకులు కాకులేనని చెప్పొద్దు నాకు

మనిషిని శాశిస్తున్నది స్వార్థమే కదరా
అవినీతి రూపాల గురించి చెప్పొద్దు నాకు

సుఖమాలోచించు వాడు శ్రమేమి చేస్తాడు
శ్రమకి భయపడు వాడి గురించి చెప్పొద్దు నాకు

పచ్చదనం మాడి కాలం వేడెక్కి పోతుంది
తలాతోకా లేని కారణాలు చెప్పొద్దు నాకు

మందువా లోగిట్లో మంట రేగింది ఓ పృథీ
పగిలిన అనుబంధాల గురించి చెప్పొద్దు నాకు

## 37

రెప్పల మాటున ఒదిగివున్న కన్నీటిని ఎలా చూడగలను
మనసు పొరల దాగిన ఆలోచనలను ఎలా చూడగలను

చెట్టును పూచిన మల్లెల నవ్వులు మదిని మీటెను
ఏ మగువ కురులలో విరుయునో ఎలా చూడగలను

కలల ఊయలలో నను ఊగించినదో కుసుమం
ఊహలు వీడిన జగానామెను ఎలా చూడగలను

మాటి మాటికి ప్రియమార రమ్మన్న పిలుపులే
పలికిన ధ్వని తరంగాలను ఎలా చూడగలను

తలుపులన్నీ తెరచుకొని జయగంట మ్రోగింది ఓ పృథ్వీ
మెరుపు కాంతుల నడుమ దివ్య తేజస్సు ఎలా చూడగలను

## 38

మనిషిని మనిషి దోచుకొంటూంటే చూస్తూ ఉండాలా
మానవత కరిగిపోతా ఉంటే చూస్తూ ఉండాలా

పెద్దనోట్ల రద్దు కలవరమై సామాన్యుడి తల తిరిగింది
పెద్దోళ్ళను చీమైనా కుట్టకుంటే చూస్తూ ఉండాలా

పాలకులు విప్పాల్సిన చిక్కుముడు లెన్నో ఉంటాయి
గద్దెక్కిన వాళ్ళు మిన్నకుంటే చూస్తు ఉండాలా

మనిషి తనానికి కొందరు రంగులు పూస్తా ఉంటారు
సిగ్గును విడిచి రంగుల హంగును చూస్తా ఉండాలా

సెల్ ఫోను లొచ్చి బూతు, పిల్లల్ని తాకింది ఓ పృథ్వీ
పచ్చని భవిత మంటై రగులుతా ఉంటె చూస్తూ ఉండాలా

## 39

అమ్మ ఒడిలో జోలపాట ఎంత మధురం
అమ్మ చేతిన గోరుముద్ద లెంత మధురం

ఎదిగి నేను ఆకాశమంత అయినా
అమ్మయనెడి పిలుపు ఎంత మధురం

నాకోసం మేడలు మిద్దెలు కూడ బెట్టకపోయిన
మనిషిగ నన్ను మలచినట్టి నాన్న మాటెంత మధురం

బంధాలలో నిరంతర తీపి నింపేవి అనుబంధాలె
చేయి విడువక వెంట నడిచే అర్ధాంగి ఎంత మధురం

ఉన్నా లేని నడుమ అగాథమేలరా పృథ్వీ
కృష్ణ, కుచేలుర స్నేహము చూడ ఎంత మధురం

## 40

అమరావతి పురమంతా తెలుగు శోభలు నిండితే చూడాలని ఉంది
తెలుగు నేల నిండుగా వాగ్విభవ శోభితమైతే చూడాలని ఉంది

బుద్ధ భగవానుడి వెలుగులు ప్రసరించిన నేలయిది
నలుదిక్కులకు శాంతి విస్తరిస్తే చూడాలని ఉంది

అవినీతి పాదరస ప్రవాహమై సాగిపోతా ఉంది
నీతిపూలు చేరి ఆనకట్టయితే చూడాలని ఉంది

మాతృభాషలోని మాధుర్యం మరువకెన్నడు నీవు
తెలుగు పరిమళం పచ్చదనమైతే చూడాలని ఉంది

మనిషి, ముఖానికి అతకని రంగులద్దు కొంటున్నాడు పృథ్వీ
మనిషితనం, శ్వేత వస్త్రంల ప్రకాశిస్తే చూడాలని ఉంది!


విశాఖరత్న కళాసాహితి వార్షికోత్సవములో సాహితీ రత్న బిరుదుతో సత్కారం


శ్రీ కిరణ్ సాంస్కృతిక సంస్థ, హైదరాబాద్ సభలో సత్కారం


కొత్తపేట, కళాసాహితి రజతోత్సవాలలో సత్కారం

రమ్యమైన మీ కవితోత్తరమ్ము చదివి
నవ్వుటలలపై ఆనంద నావనైతి!
జ్ఞాపకాలను మథియించి స్వార్థవహ్ని
నార్పి మానవ తామృత మందుకొంటి!!

"కవి కౌస్తుభ"
డాక్టర్. ఆచార్య తిరుమల